# దేశోద్ధారకులు

## మొదటి భాగము

సంపాదకుఁడు

బి. వి. నాంచారయ్య, యం.ఏ.,

14472

ప్రకాశకులు

సుందరరాం అండ్ సన్సు, తెనాలి.

 1947 [ 0—4—0

# ప రి చ య ము

పిల్లల మనస్సులు బహు కోమలములు. మిక్కిలి నిర్మలములు. ఇట్టి హృదయములందు శైశవమందే ఉత్తమబీజముల నాటి వారి భవిష్యజ్జీవిత సౌధమునకు గట్టి పునాదులు నిర్మించుట యోగ్యము.

ప్రతి జీవితచరిత్రము పలుగకముల వెలుగునీడలతో నిండి యుండును. మహాత్ముల జీవితగాథలు ప్రపంచమునకు మార్గ దర్శకములు. విజ్ఞానవాహినులు. ఇట్టి గాథలను పిల్లల హృదయక్షేత్రములందు ప్రతిఫలింప జేయుటయే మా యుద్దేశ్యము.

సంపాదకుడు.

# విషయసూచిక

పేజి.

I



మహాత్మా గాంధి

# 1. మహాత్మా గాంధీ

మన దేశమున ఎందరో మేధావంతులు, గుణవంతులు, దేశభక్తులు, దైవభక్తులు పుట్టి కీర్తిగాంచిరి. ప్రహ్లాదుడు-హరిశ్చంద్రుడు-బుద్ధుడు మొదలగు మహానుభావులు పుట్టిన, ఈ పుణ్యభూమిలో గుజరాతీ దేశమునందు గాంధిమహాత్ముడు జన్మించెను.

గాంధిమహాత్ముడు చిన్నతనముననే పెద్ద చదువులు చదివెను. చదువుకొనునపుడు సయితము తనతోటి బాలురతో ఆటలందు కూడ అతడు బొంకి ఎరుగడు. గురువులయందెక్కువ భక్తిగలవాడు. తల్లితండ్రులను బహు భక్తితో పూజించెడివాడు. ఉన్నతవిద్యకొరకు గాంధిమహాత్ముడు సీమకు వెళ్లెను. అచ్చట న్యాయవాది పరీక్షనిచ్చెను. మంచి నియమములతో జీవించెను. ఆ దేశమునందున్నప్పుడు మన దేశ గౌరవమును జాగ్రత్తగ కాపాడెను.

మన దేశమును రక్షించుటకై అతడెన్నియో కష్టముల పొందెను కారాగృహములందు పెట్టబడెను. దీనరక్షణమునకు ఎన్నెన్ని బాధలనో అనుభవించెను. ఏ ప్రాణికి ఎవరివలన బాధ కల్గినను గాంధిమహాత్ముడు కంట నీరుపెట్టును. భూతదయ విషయమున ఆయన బుద్ధునివంటివాడు. సత్యము కొరకు ఎంతటి కష్టములనైనను జంకులేక అనుభవించును. అందుచే ఆయన హరిశ్చంద్రుని వంటివాడు.

మహాత్ముడు గొప్ప దైవభక్తుడు. దేశమునందు దుర్మార్గము నశింపచేయుటకు ఏ మార్గము కానరానపుడు ఆయన ఉపవాసదీక్ష పూనును. నిద్రాహారముల మాని ఏకదీక్షతో భగవంతుని ప్రార్థించును. ఆ సమయములందు దేవుడు ఆయనకు సన్మార్గము చూపును.

"ఎల్ల సమయములందు సత్యమునే పలుకుము. ఎవరినైనను ఎన్నడును బాధింపకుము. మంచి చేయుటకు జంకకుము. మత్తువస్తువుల మానుము. ధర్మరక్షణకును అధర్మనాశనమునకును ప్రాణములనైన బలియిమ్ము. సత్యమే దేవుడు." ఇది గాంధిమహాత్ముని బోధ.

మహాత్ముడు ఇతరులకు దేనిని బోధించునో దానిని తాను ముందాచరించును. అందువలన ఇతరులకు మహాత్ముడు ప్రత్యక్ష మార్గదర్శి యగుచున్నాడు. కనుకనే ఆయనను "మహాత్ముడు" అని జనులు చెప్పుకొనుచున్నారు.

## 2. ఆంధ్రరత్నము

"రత్నము" అను పదమునకు శ్రేష్ఠమైనది అని యర్థము. కొంతకాలముక్రిందట ఆంధ్రదేశమునందు దుగ్గిరాల గోపాలకృష్ణయ్య అను మహాపురుషుడుండెను. ఆంధ్రులలో ఉత్తముడైనందున ఆయనను "ఆంధ్రరత్న" మని పిలుచుచుండిరి.

గోపాలకృష్ణయ్యగారు గొప్ప దేశాభిమాని. తత్వవేత్త. కళారాధకుడు, గాయకుడు, నటుడు. వేయేల సర్వవిద్యలును ఆ మహానీయునిలో జీర్ణమై యుండినవి.

ఆంధ్రరత్నము చిన్నతనమునుండి గొప్ప తెలివితేటలు, స్వతంత్రబుద్ధి కలవాడు. కొంతవరకు మనదేశమునందే విద్యనేర్చి ఉన్నతవిద్యకై సీమకు వెళ్లెను. అచ్చట గొప్ప చదువులు చదివెను. తెలుగుజాతి గౌరవమును, నాగరకతను అనేక విధముల ప్రపంచమునకు వెల్లడిచేసెను. పురాణములు, హరికథలు, భజనలు ప్రదర్శించి సీమయందలి ప్రజలకు ఆనందమును కల్గించెనట.

స్వదేశమునకు తిరిగివచ్చి కొలదికాలము రాజమహేంద్రవరమునందలిప్రభుత్వకళాశాలలో ఆచార్యుడుగ పనిచేసెను. కానిమహానీయునకు ఉద్యోగమూరుచింపలేదు. జాతీయ విద్యకొరకాయన పాటుపడెను. బందరు కళాశాలలో ఆచార్యుడుగ మరల ప్రవేశించెను. అదియు నాయనకు రుచింపలేదు.

గాంధిమహాత్మునితో దేశసేవకు గడంగెను. చాల కష్టముల పడెను. పెక్కుసారులు ఖయిదులో పెట్టబడెను. చీరాల, పేరాల గ్రామములలో ప్రజాస్వాతంత్ర్యమునకై పెద్ద పోరాటమును కల్గించెను. ప్రభుత్వము నోడించెను.

"ఆంధ్ర విద్యాపీఠగోష్ఠి" అను విద్యాసంఘమును ఆయన స్థాపించెను. నిమ్నజాతులకొరకు బహు కష్టముల పడెను. ఆయన గొప్ప రామభక్తుడు.

మెడయందు రుద్రాక్షలు, ముఖమున కుంకుమబొట్టు, కావిరంగు వస్త్రములు ధరించి, చిరుతలు చేతబట్టి ఉద్రేకముతో గీత గోవిందమును తరంగములను పాడుచు కాలక్షేపము చేసిన రామభక్తుడు ఆంధ్రరత్నము. ఆయనను మఱచుటెట్లు? ఇట్టి మహనీయుడు దేశసేవయందు బహు కష్టముల పొంది తుదకు ప్రాణముల కోల్పోయెను.

## 3. మౌలానా హకీమ్ అజ్మల్ ఖాన్

పశువులకంటె మనుష్యులు గొప్ప. ఎందుచేత? పశువులు మాట్లాడలేవు. మనుష్యులకువలె వానికి జ్ఞానము లేదు. అందుచే మంచిచెడ్డలు తెలియవు.

ఒకరికొకరు సహాయపడుట మనుష్యుల విధి. కుక్క మరొక కుక్కను చూచిన కయ్యమునకు కాలు దువ్వును. పశువులు వానిలో నవి కుమ్ముకొనును. జ్ఞానములేని మనుష్యులు పశువులవలెనే పోట్లాడుకొనుచుందురు. మనము మనుష్యులమై పుట్టితిమి. మనకు జ్ఞానము కలదు. మంచి చెడ్డల తెలిసికొనగలము. అందుచే ఒకరికి సహాయము చేయుట, ఒకరివలన సహాయము పొందుట మనవిధి.

మౌలానా హకీమ్ అజ్మల్ఖాన్‌గారు ఢిల్లీలో ఒక గొప్ప వైద్యుడు. వైద్యవృత్తివలన ఆయన చాల ధనమును సంపాదించెను. గొప్పగొప్పవారి యిండ్లలో ఆయన వైద్యము చేసి చాల ధనమును సంపాదించెను.

# 3. మౌలానా హకీమ్ అజ్మల్ ఖాన్

పశువులకంటె మనుష్యులు గొప్ప. ఎందుచేత ? పశువులు మాట్లాడలేవు. మనుష్యులకువలె వానికి జ్ఞానము లేదు. అందుచే మంచిచెడ్డలు తెలియవు.

ఒకరికొకరు సహాయపడుట మనుష్యుల విధి. కుక్క మరొక కుక్కను చూచిన కయ్యమునకు కాలు దువ్వును. పశువులు వానిలో నవి కుమ్ముకొనును. జ్ఞానములేని మనుష్యులు పశువులవలెనే పోట్లాడుకొనుచుందురు. మనము మనుష్యులమై పుట్టితిమి. మనకు జ్ఞానము కలదు. మంచి చెడ్డల తెలిసికొనగలము. అందుచే ఒకరికి సహాయము చేయుట, ఒకరివలన సహాయము పొందుట మనవిధి.

మౌలానా హకీమ్ అజ్మల్ ఖాన్‌గారు ఢిల్లీలో ఒక గొప్ప వైద్యుడు. వైద్యవృత్తివలన ఆయన చాల ధనమును సంపాదించెను. గొప్పగొప్పవారి యిండ్లలో ఆయన వైద్యము చేసి చాల ధనమును సంపాదించెను.

ఎందరు ధనవంతులు లేరు ? ధనముకంటె గుణము గొప్పది. మనము ధనవంతులమగుట కష్టముగావచ్చును. గుణవంతులమగుట మన చేతిలోని పని.

అజ్మల్ ఖాన్ ధనముకంటె గుణమే ముఖ్యమని భావించెను. తన ధనమును ధర్మము చేయుటయందు వెచ్చించెను. బీదలను పోషించుట, ప్రజలను బాధలనుండి రక్షించుట,

దేశమునకు సేవచేయుట తన ముఖ్య కర్తవ్యములని ఆయన భావించెను. తన ధనమును ప్రజాసేవకై ధారపోసెను. ప్రజల కష్టములు తన కష్టములని తలచెను. ప్రజలకై తాను సర్వము నర్పించెను.

గాంధిమహాత్ముడు ప్రజలకొరకు పాటుపడుచుండెను. అజ్మల్ ఖాను మహాత్ముని చెంత చేరి, దేశసేవ చేసెను. అనేక కష్టముల ననుభవించెను. చెరసాలకు వెళ్లెను. అజ్మల్ ఖాన్ జీవించినంతకాలము ప్రజాసేవ జేసి పరుల కష్టములను తీర్చుటయందే తన ప్రాణముల వదలెను.

# 4. బుద్ధుడు

పూర్వకాలమున శుద్ధోదనుడను ఒకరాజు నేపాళదేశమును పరిపాలించెను. ఆయన భార్యపేరు మాయాదేవి.

ఒకరాత్రి ఆమె యొక కల కనెను. ఆ కలలో దేవుడామెకు కనపడి "తల్లీ నేను నీకు కొడుకునై పుట్టి ప్రపంచమును పాపమునుండి తొలగించెదను" అని చెప్పి మాయమయ్యెను.

కొంతకాలమునకు మాయాదేవి కొక కొడుకు పుట్టెను. కల నిజమయ్యెనని తల్లిదండ్రులు మిక్కిలి సంతోషించి కుమారునకు సిద్ధార్థుడని నామకరణము చేసిరి.

కొన్ని దినములు గడచినతరువాత ఒక బ్రాహ్మణుడు రాజుతో ఇట్లు చెప్పెను. "ఓ రాజా! నీ కుమారుడు రాజాధిరాజగును. లేదా, సన్యాసియై ప్రజలకు మోక్షమార్గమును చూపును."

చాలకాలమువరకు వివాహము చేయకున్న యెడల తన కుమారుడు సన్యాసియగునని భయపడి రా జాతనికి చిన్నతనమునందే పెండ్లి చేసెను. సిద్ధార్థుని భార్యపేరు యశోధర.

ఒకానొక బోయవా డొకదినమున వేటకు పోయి పిట్ట నొకదానిని తన బాణముతో కొట్టెను. అది క్రిందపడి గిలగిల కొట్టుకొనుచుండగా సిద్ధార్థుడు బోయవానితో "ఓయీ దానినేల కొట్టితివి. దాని ప్రాణము నీ ప్రాణమువంటిది కాదా" యని వానిని మందలించెను.

మరియొకనాడు, సిద్ధార్థుడు తన మేడపై నుండగా వీధివెంట శవమును తీసికొని పోవుటను చూచెను. అదిమొదలు లాతని మనస్సు ప్రపంచ విషయములపై విరక్తి పొందెను.

తరువాత కొంతకాలమునకు సిద్ధార్థుడు సంసారమును వదలి, అడవులకు వెళ్లెను. సన్యాసియై తపస్సుచేసెను. నిద్రాహారములు వదలుకొనెను. ఒకనాడు సొమ్మసిల్లి నేలవ్రాలెను. ఒక గొల్లపిల్ల పాలిచ్చి ఆయనను రక్షించెను. ఇంత శ్రమపడినను సిద్ధార్థునకు జ్ఞానోదయము కాలేదు.

సిద్ధార్థుడు గయకు వెళ్లెను. అక్కడ ఒక రావిచెట్టు క్రింద శాంతముగా కూర్చుండి దేవుని ప్రార్థించెను. అప్పుడు సిద్ధార్థునకు జ్ఞానము కలిగెను. నాటినుండి సిద్ధార్థునకు బుద్ధుడను పేరు వచ్చెను.

"జీవహింస చేయవద్దు. సత్యము నే పలుకుము. ధర్మమును ఆచరింపుము. పెద్దలను గౌరవింపుము. జ్ఞానమును పొందుము" అని బుద్ధుడు ప్రజలకు బోధించి సిద్ధిపొందెను.

బుద్ధుని మతమునకు 'బౌద్ధమతము' అని పేరు. బౌద్ధమతము అనేక దేశములందు ఎక్కువగా వ్యాపించెను. బుద్ధుడు దేవుని అవతారమని పెద్దలు చెప్పుదురు.

# 5. రామకృష్ణ పరమహంస

రామకృష్ణ పరమహంస బంగాళా దేశమునందు జన్మిం చెను. ఈ మహనీయునికి తల్లిదండ్రులు పెట్టిన పేరు "గదా ధరుడు." తండ్రి కుదీరామ ఛటర్జీ. తల్లి చంద్రమణి. గదా ధరుడు చిన్నతనమునందు క్రమముగ బడికి వెళ్లెడువాడు కాడు. ఎప్పుడును పరధ్యానముగా ఏదో యోచించెడివాడు. వారి ఊరివెలుపల ఒక మఠముండెడిది. గదాధరుడు ఆ మఠము నందలి సన్యాసులతో కాలము గడిపెడివాడు.

గదాధరుని చూచి తల్లితండ్రులు మిక్కిలి విచారమును పొందిరి. ఏమియు తోచక దక్షిణేశ్వరమందలి కాళీ దేవా లయములో గదాధరుని పూజారిగా తండ్రి ప్రవేశపెట్టెను. గదాధరునకు అప్పుడు 16 ఏండ్ల వయస్సు.

కాళీ దేవాలయము గదాధరుని జీవితమును అద్భుత ముగా మార్చెను. పూజచేయుట నైవేద్యము పెట్టుట గాక ఎల్లప్పుడు కాళీమాతను గదాధరుడు పూజించుచుండెడివాడు. అప్పుడప్పుడు కాళికాదేవి ధ్యానములో ఒడలు మరచి యుండెడివాడు.

ఈ తపస్సులో నున్నప్పుడు ఆయన నిద్రాహారములను కూడ మఱచెడివాడు.

తల్లితండ్రులు గదాధరునికి పిచ్చియెత్తినదని భావించిరి. పెండ్లిచేసినకాని పిచ్చి కుదురదు అని "శారదామణి" అను

కన్యనిచ్చి వివాహము చేసిరి. కాని వివాహము గదాధరునిలో ఎట్టి మార్పును తేజాలకపోయెను.

క్రమముగా గదాధరుని భక్తి పెరిగిపోవుచుండెను. అతని భక్తికి మెచ్చి ఒకనాడు కాళీమాత అతనికి ప్రత్యక్షమయ్యెను. అప్పటినుండి గదాధరుడు సన్యసించెను. విరాగియై జ్ఞానమును పొందెను. ఆనాటినుండి ఆయన పేరు "రామకృష్ణ పరమహంస."

అనేకమంది ఆయన చెంతచేరి శిష్యులై ఉపదేశములను పొందుచుండెడివారు. ఆ మహనీయుని చూచినంతనే ప్రజలు తమ కష్టములను మరచెడివారు.

"సర్వమతములు జనులకు మోక్షమిచ్చుటకే ఏర్పడి యున్నవి. అందరియెడలను ప్రేమగలిగి యుండవలయును. అన్ని మతములయందును సహనము కలిగి యుండవలయును. అని బోధించి రామకృష్ణుడు సిద్ధిపొందెను.

# 6. హరనాథబాబు

హరనాథుడు మహాభక్తుడు. ఆయన బంగాళా దేశము నందు పుట్టెను. చాలా కాలముక్రింద బంగాళా దేశములో "శ్రీకృష్ణ చైతన్యుడు" అను మహాభక్తుడు జన్మించెను. మరల ఆ చైతన్యుడే "హరనాథుడు"గా పుట్టెనని కొందరందురు.

చిన్ననాటినుండియు హరనాథుడు శ్రీకృష్ణుని పూజించెడివాడు. కృష్ణుని భజన చేయునపుడు అతడు ఒడలు మఱచి పోయెడివాడట.

"మనము దేవుని భజన చేయవలయును. దేవుని శ్రీకృష్ణుడనుము. రాముడనుము, శివుడనుము, ఏ పేరుతో ఆయనను భజించినను మనలను దేవుడు ప్రేమించును, రక్షించును. కనుక ఆయనను భజన చేయుటే మనపని" అని హరనాథుడు బోధించెను.

శ్రీకృష్ణునకు చేతిలో మురళి, హరనాథునకు చేతిలో కలము. కృష్ణుడు తన మురళితో గోగోపబృందములను తన యొద్దకు చేర్చుకొనెను. హరనాథుడు తన కలముతో వ్రాసి ప్రజలకు మోక్షమార్గమును చూపెను. వేలకొలది జాబులు శిష్యులకు వ్రాసెను.

ఆ లేఖలలో అనేక నీతులు నుపదేశము లుండెడివి. ఆయన వ్రాతలు అమృతతుల్యములు. అవి బంగాళాభాషలోను, ఆంగ్లభాషలోను అచ్చువేయఃబడి ఉన్నవి.

హరనాథుడు చాలాకాలము భక్తిని ప్రచారముచేసి సిద్ధిపొందెను. ఇప్పటికిని అనేకులు ఆయన భక్తులై ఉన్నారు. హరనాథ భజనలు చేయుచున్నారు. ఆయన విగ్రహములతో దేవాలయములు కట్టించి అచట పూజలు సల్పుచున్నారు.

# 7 మీరాబాయి

హిందూ దేశమునందు పెక్కుమంది భక్తులు పుట్టి ప్రకాశించిరి. వారిందరిలోను "మీరాబాయి" చాల ఉత్తము రాలు.

మన దేశమందు "రాజపుత్రులు" అను గొప్ప జాతి కలదు. ఈ జాతివారు చాల బలపరాక్రమ సంపన్నులు. మహారాజులు.

అట్టి జాతిలో చేరిన ఉదయపుర మహారాజునకు మీరాబాయి జన్మించినది. చిన్నతనమందే ఆమెకు తల్లి తండ్రులు గతించిరి. తాతగారు ఆమెను పెంచి పెద్దచేసెను.

మీరాబాయి తాత గొప్ప భక్తుడు. ఆయన ప్రతి దినము దేవాలయమునకు వెళ్లెడివాడు. కృష్ణుని పూజించెడి వాడు. మీరా చిన్నతనమునందు తన తాతతో దేవాలయ మునకు పోవుచుండెడిది.

పెద్దలు ఏపని చేసినను పిన్నలు దానిని అనుకరించుట వారికి సహజము. పసిబిడ్డ మీరా తాతవలెనే శ్రీకృష్ణుని పూజించెడిది.

క్రమముగ మీరా పెరిగి పెద్దదయ్యెను. అప్పుడు తాత గారు చిత్తూరు మహారాజునకు మీరా నిచ్చి వివాహము చేసిరి. మీరా చిత్తూరు రాజ్యపు మహారాణి యయ్యెను.

కాని మీరా ప్రాపంచికసుఖములను వదలెను. ఎల్ల వేళల శ్రీకృష్ణుని పూజించుచు, భజనలతో నృత్యగానములతో కాలము గడుపుచుండెను.

చిత్తూరు మహారాజునకు తన భార్య స్థితి చాల కష్టముగ నుండెను. "నీకిది తగదు" అని మహారాజు మీరాను మందలించెను. కాని మహాభక్తురాలు మీరా కృష్ణనామ భజనను వదలలేదు. అందుచే మహారాజునకు కోపము వచ్చెను. కొంతకాలమునకు కోపము అసూయగా మారెను. ఆకారణమున మహారాజు మీరాబాయిని చంపించి తన గౌరవమును కాపాడుకొనదలచెను.

ఒకదినము మీరా గది తలుపు మూసికొని గదిలో ఒంటరిగా కృష్ణుని భజించుచుండెను. అప్పుడు శ్రీకృష్ణుడామెకు ప్రత్యక్షమాయెను. "కృష్ణా! కృష్ణా! వచ్చితివా? నన్ను రక్షింపుము." అనుచు ఆనందముతో ప్రార్థన సలుపుచుండెను. మహారాజు తలుపువద్ద నిలువబడి గదిలోని మాటలను వినెను. మరొక పురుషునితో మీరా మాట్లాడుచున్నది అని అనుమానించి తలుపులు పగులగొట్టి గదిలో ప్రవేశించెను. ఎవరును లేరు. మీరాయొక్కతే మహదానందమున కన్నులు మూసి ప్రార్థించుచుండెను. మహారాజు గదియంతయూ వెదకెను. ఎవరును అచటలేరు. మీరాకు పిచ్చియెత్తినదని భావించెను.

పిచ్చి మీరాను తొందరగా రూపుమాపవలయునని తలచి మహారాజు గంధపు చెక్కలతో చేయబడిన యొక

పెట్టెలో గొప్ప త్రాచుపామునుంచి "దీనిలో నీ ప్రభువు శ్రీకృష్ణుడున్నాడు. దీనిని మహారాజుగారు నీకు కానుకగా పంపిరి" అని పంపెను.

మహాభక్తురాలు మీరా ఆనందముతో తన కృష్ణుడు పెట్టెయందు దాగియున్నాడని పెట్టెను తెరిచెను. ఆశ్చర్యము! అందేమి యుండెను ? త్రాచుపాము.

కాని అది మీరాను కాటువేయలేదు. మీరా తదేక ధ్యానముతో ఆ పామువంక చూచెను. ఆ పడగపై ముద్దు కృష్ణుడు మురళిని బూని కాళీయమర్ధనము చేయుచున్నట్లు మీరాకు కనబడెను. మీరా ఆనందమునకు మేర లేకపోయెను.

మరొకనాడు కాలకూటవిషమును ఒక బంగారు పాత్రలోనుంచి "ఇది నీ కృష్ణభగవానుని ప్రసాదము. పానకము, త్రాగుము." అని మహారాజా పాత్రను మీరాకుపంపిరి. "ఆహా! నాకృష్ణుని ప్రసాదమా! యిది! నాజన్మ తరించినది. నేను ధన్యను," అనుచు ఆ కాలకూట విషమును మీరా గడ గడ త్రాగెను. అది నిజముగా అమృతముగా మారి ఆమె యానందమును వృద్ధిపరచెను.

ఆమెను చంపుటకు ఇట్లు ఎన్నియో ప్రయత్నములు జరిగినవి. కాని మీరా చావలేదు.

చిత్తూరు వదలి మీరా ద్వారకాపురికి, బృందావనమునకు వెళ్ళెను. అనేకులు ఆమెకు భక్తులయిరి. కృష్ణుని భజించుకొనుచు ఆమె అనేక పుణ్యక్షేత్రములకు వెళ్ళెను.

మీరాబాయి చిత్తూరు వదలి వెళ్ళినది మొదలు కలరా, మహామారి మొదలగు వ్యాధులతో, అంతులేని కష్టములతో చిత్తూరొక నరకకూపముగా మారెను. మహారాజు మతి చెడెను. వెంటనే మీరాకొరకు వెదకించెను. కాని లాభము లేకపోయెను. ద్వారకలో శ్రీకృష్ణుని పాదపద్మముల యొద్ద ఆమె శాశ్వతముగా నిదురించెను.

మీరాబాయి సుక్షత్రియ వంశమునపుట్టి ఒక మహారాజాధిరాజును చేపట్టి. ఈలోకపు సౌఖ్యముల త్యజించి మహాభక్తురాలై పరమపదించినది.

మీరాబాయి చక్కని గీతములు రచించెను. అవి చాలా భక్తిపూరితములు. మీరాబాయి గీతములు గాంధీ మహాత్మునకు చాల యిష్టము.

# 8. వేమనయోగి

మనము కూటికి పేదలము కావచ్చును, కాని గుణమునను పేదలము కాకూడదు. ఏ కులమున పుట్టినను గుణము ముఖ్యము. బ్రాహ్మణుడైనను చెడుగుణములవలన కడజాతివాడగును. అధమకులమువాడైనను మంచిగుణముల మూలమున మహాత్ముడగును. చదువుకొన్న గుణహీనునికంటె చదువులేని గుణవంతుడే మేలు. పేదవాడైనను, తక్కువకులమువాడైనను, విద్యలేనివాడైనను మంచిగుణములు కలవాడైనచో మహాయోగి కాగలడు. వేమన కథయందు ఈ నిజమును మనము గ్రహింపగలము.

తెలుగుదేశములో "కొండవీడు" అను గ్రామము కలదు. అందు గొప్ప కోటనుకట్టి రెడ్డిరాజులు ఏలుచుండిరి. రెడ్డిరాజుల కొలువులో తుంగకేశవుడు అను రెడ్డి యుండెను. అతడే వేమన్నకు తండ్రి.

తుంగకేశవుడు మంచి భక్తుడు. సంపాదించిన ధనముతో తుంగకేశవుడు మార్కాపురమునకు పోయెను. అచ్చట చెన్నకేశవస్వామికి ఆలయము కట్టించెను. ఆ స్వామికొరకు తన ధనమునంతయు వెచ్చించెను.

తుంగకేశవుని భక్తి వేమన్నను ఆకర్షించినది. వేమన కొద్దికాలములో భక్తుడాయెను. వేమన్న మంచి గుణవంతుడు, చక్కని కవి. తేటతెలుగు మాటలతో అందరకు తెలియునట్లు వేమన పద్యముల చెప్పెడివాడు. పండితులు వేమన్న పద్య

ములను నిందించెడివారు. కాని, వేమన జంకు గొంకులులేక పద్యములు చెప్పెడివాడు. వేమన పద్యములలో చాలా నీతులు బోధింపబడినవి. "అన్ని జీవులయందు దయకలిగి ఉండుము. సత్యమును మాట్లాడుము. దొంగతనము వీడుము. ఇతరుల మనస్సు నొప్పింపకుము. కలిగినంతతో సంతృప్తి చెందుము. కోప తాపముల వదలుము. ఎల్లప్పుడు దేవుని సేవింపుము." ఇట్టి నీతులను వేమన తన పద్యముల మూలమున బోధించెను. ఎచ్చట దోషము కలదో, అచ్చట నీతి లేదో, అట్టిదానిని వేమన్న నిర్భయముగా దిద్దెను. చాల దినములు వేమన్నను ప్రజలు పిచ్చివాడనిరి; కాని కొంతకాలమైనపిదప వేమన్న పిచ్చివాడు కాడనియు, గొప్ప మహాత్ముడనియు దెలిసికొనిరి; ఆనాటినుండి వేమనను వేమనయోగి యని పిలువ నారంభించిరి.

వేమనయోగి దేశదేశములు తిరిగి అనేక ధర్మములు, నీతులు బోధించెను. వానిని తాను రచించిన పద్యముల మూలమున బోధించెను. వేమనయోగి పద్యములు వేనకు వేలు కలవు. అందు కొన్ని మాత్రమే పుస్తకములందు కలవు. తెలుగుకవులందు వేమన గొప్ప కవియని పేరుపొందెను.

మంచి గుణములవల్లనే మహాత్ముడైన వేమనయోగి తెలుగువారికి తెలిపిన మహాబోధలు తెలుగులోకమున చిరకాలము నిలిచిపోవును. వేమనయోగి చిరంజీవి.

# 9. శ్రీకృష్ణదేవరాయలు

మనది తెలుగుదేశము. మనము తెలుగువారము. మనము మాట్లాడుభాష తెలుగు. తెలుగుదేశమును త్రిలింగ దేశము. ఆంధ్రదేశము అని కూడ చెప్పుదురు.

గోదావరి, కృష్ణ, తుంగభద్ర, పినాకిని మొదలగు పుణ్యనదులు మనకు అమృతమువంటి నీరమునిచ్చి మనలను పోషించుచున్నవి.

అమరావతి, ద్రాక్షారామము, శ్రీశైలము, తిరుపతి కాళహస్తి, సింహాచలము, మంగళగిరి మొదలగు పుణ్య ప్రదేశములు ఆంధ్రదేశమున నున్నవి. అమరావతి, అజంతా ఎల్లోరాలలోని చెక్కడపు పనులు, చిత్రపటములు ఆంధ్రుల సొమ్ము. కొండవీడు, కొండపల్లి, ఉదయగిరి, హంపి, విజయ నగరము, బొబ్బిలి మొదలగు పెద్ద పెద్ద దుర్గములు మన దేశము లోనివి.

అనేక సంవత్సరముల క్రిందట మన తెలుగు దేశము గొప్ప పేరుపొందియుండెను. మంచి బలము–పరాక్రమముగల మహారాజులు ఎందరెందరో ఈ దేశమును పాలించిరి. అట్టి మహారాజులలో "శ్రీకృష్ణదేవరాయలు" ఒకడు.

తుంగభద్రానదిఒడ్డున హంపిక్షేత్రము కలదు. అచట విజయనగరము అను చక్కని పట్టణము ఉండెను. ఆ పట్టణము కృష్ణదేవరాయలకు ముఖ్యపట్టణము.

కృష్ణదేవరాయలు గొప్ప తెలివికలవాడు. విశేష బలపరాక్రమములు కలవాడు. ధైర్యసాహసములలో ఎవరును ఆయనకు సాటిరారు. ఆయన మంత్రిపేరు తిమ్మరుసు.

తిమ్మరుసు కృష్ణరాయలు తనతండ్రివలె చూచుకొనుచుండెను. ఆతనను "అప్పాజీ"అని పిలుచుచుండెను. అప్పాజి అనగా తండ్రిగారు అని యర్థము. తిమ్మరుసు కూడ మిక్కిలి తెలివికలవాడు. ఆయన తెలివియు కృష్ణదేవరాయల బలపరాక్రమములును ఆంధ్రదేశమునంతయు ప్రకాశింపజేసినవి.

రాయల రాజ్యమున ఆకలిబాధలేదు. విచారములేదు. ఎచ్చట చూచినను ఆనందమే. ఎచ్చట వినినను కృష్ణరాయల విజయ కథలే. ఆయనకాలములో తెలుగుదేశము మిక్కిలి గొప్పదాయెను. శత్రురాజులకు మిక్కిలి భయంకరమైయుండెను ప్రజలపాలిటికి రామరాజ్యమువలె నుండెను.

కృష్ణదేవరాయలు గొప్ప రాజు మాత్రముకాదు. ఆయన గొప్ప పండితుడు. చక్కని కవి. చాలమంది పండితులను పోషించెను. ఆయన ఆస్థానమున గొప్పకవులుండిరి. ఆయన గొప్ప గ్రంథము నొక్కదానిని వ్రాసెను. తెలుగు విద్యలు, తెలుగు భాష, తెలుగు కళలు కృష్ణరాయలకు ప్రాణమువంటివి. కృష్ణరాయల కాలమున తెలుగుదేశము దేశ దేశములందు గొప్ప ఖ్యాతిని పొందెను. ఆంధ్రపతాకము రాజ్యమందంతటను వ్యాపించియుంచెను.

మహారాజు శ్రీకృష్ణరాయలను మహామంత్రి తిమ్మరుసును తెలుగువారు మరువగలరా ?

# 10. సోదరి నివేదిత

మన దేశమందు పుట్టిన ప్రజలు మనము సేవ చేయుట గొప్పకాదు. అది సామాన్యము. మనము ఇతర దేశస్థులకును, ఇతర దేశస్థులు మనకును చేయు సేవయే విశేషమైనది.

సోదరీ నివేదిత, మాతా అనిబిసెంటు, దేశబంధు, ఆండ్రూసువంటి గొప్పవారు మన దేశమునకు వచ్చి మన ప్రజలకు గావించిన సేవ మనము మరువరానిది.

సోదరీ నివేదిత సీమలో పుట్టి పెరిగినది. ఆమె తల్లి దండ్రులు మిక్కిలి ధనికులు. నివేదితకు తల్లిదండ్రులు పెట్టిన పేరు "మార్గరెట్ ఎలిజిబత్ నోబిల్"

నివేదిత చిన్నతనమందే బాగుగ చదివి గొప్ప విద్యాధికరాలయ్యెను. లండను పట్టణములో స్త్రీల విద్యాభివృద్ధికి ఒక పెద్ద పాఠశాలను నిర్మించి అందు తాను కొంతకాలము పనిచేసెను. దేవుడు ఆమెకు విశాలహృదయము నిచ్చెను. ఆమెకు ప్రేమ, గౌరవము, భక్తి, శ్రద్ధలు మెండు. ఆనాటికే నివేదిత తత్వజ్ఞాన సంపన్నురాలును, భక్తురాలు నయ్యెను.

మన దేశమున శ్రీరామకృష్ణ పరమహంసకు చాల మంది శిష్యులుండిరి. వారందరిలో వివేకానందుడు మిక్కిలి గొప్పవాడు. తత్వబోధకై వివేకానందస్వామి ఇతర దేశము లందు సంచారము చేసెను. ఆయన సీమయందు తత్వబోధ చేయునపుడు సోదరీ నివేదిత స్వామిని పరిచయము గావించు కొనెను.

వివేకానందుని మహాజ్ఞానము, తత్వబోధ నివేదితను ఆకర్షించెను. ఆకారణమున స్వామికి నివేదిత శిష్యురాలాయెను. ఆమె తన తల్లి తండ్రులను, ప్రజను, దేశమునువీడి మన దేశమునకు వచ్చెను. హిందూమతమును స్వీకరించెను. తన సర్వమును మన దేశమునకే నివేదించెను. అందులకే వివేకానందుడు ఆమెకు "నివేదిత" అని పేరు పెట్టెను. ఎంతటిమార్పు ! ఎంతటి త్యాగము ? ఎంత భక్తి ?

సోదరీ నివేదిత మన దేశ స్త్రీల విద్యకొఱకు, వారి అభివృద్ధినిమిత్తమును ఎన్నియో విధముల కృషి చేసెను. ప్రజాసేవయే తన ముఖ్యవిధిగ ఆమె భావించెను. బంగాళాదేశమునందు నదులు పొంగి వఱదలు, వఱదలవలన విషరోగములు, కఱవులు సంభవించినపుడు నివేదిత చేసిన సేవను ఎవరు మరతురు ?

నివేదిత చాల గ్రంథములను వ్రాసెను. ప్రపంచమునందు ఆ గ్రంథములు మన్నలను పొందినవి. ఆమె ఎచ్చట ఎప్పుడు మాట్లాడినను దేనిని వ్రాసినను హిందూమతమును హిందూధర్మశాస్త్రములను పురాణములను మిక్కిలిగ పొగడుచుండెను. హిందూదేశము అనిన ఆమెకు మిక్కిలి ప్రేమ.

మన దేశపు నిజస్థితిని ఇతరులకు తెలియచేసి ఇతరులకు మనయందును, మనమతమునందును శాస్త్రములందును, కళలయందును, అంతులేని భక్తిని శ్రద్ధలను కల్గించి మనకు మేలు చేసిన దేవదూత సోదరీ నివేదిత.

వివేకానందునితో శిష్యురాలుకూడ ఇతర దేశములకు వెళ్ళి తత్వజ్ఞానమును మన నాగరికతను ప్రబోధించెను.

మహాత్ముడగు వివేకానందుడు సిద్ధిపొందిన తర్వాత కూడ నివేదిత దేశమునందలి అన్నిపట్టణములలో గురుబోధ ప్రచారము చేయుచు అనేక పుణ్యక్షేత్రములను సేవించెను.

తన సర్వస్వము మన దేశమునకు నివేదించిన ఆ మహా తల్లి తన ప్రాణములను కూడ ఈ దేశమునందే విడచెను.

# 11. రవీంద్రనాథ్

రవీంద్రుడు ప్రపంచ ప్రఖ్యాతిగాంచిన కవీంద్రుడు. కలకత్తా పట్టణమున ఆయన జన్మించెను. ఠాకూరు వంశమున గొప్ప పండితులు, కవులు, గాయకులు, శిల్పులు కలరు. రవీంద్రుని తండ్రి "దేవేంద్రనాథ్ ఠాకూరు." ఆయన ఒక మహాఋషి.

చిన్నతనమునందే రవీంద్రుడు తండ్రితో హిమాలయ పర్వతములకు వెళ్ళెను. ఆ కొండల సొగసునుచూచి చాల ఆనందించెను. అచ్చటి సృష్టి విచిత్రములు రవీంద్రుని హృదయములో గొప్ప మార్పు గావించెను.

రవీంద్రునికి చిన్నతనమున విద్య బాగుగా జరుగలేదు. ఆయనకు పాఠశాల యందలి విద్య రుచింపలేదు. అందుచే తండ్రియే స్వయముగ రవీంద్రునకు విద్యాబుద్ధులు గరపెను.

రవీంద్రుని సోదరులు అందరును మంచి జ్ఞానవంతులు. రవీంద్రుడు చదువునకై సీమకు పంపబడెను. అక్కడ ఆయనకు జబ్బుచేసి యింటికి తిరిగివచ్చెను. రవీంద్రుని చిన్ననాటి చదువు పెద్దయైన పిదప ఆయనకు తోడ్పడలేదు.

రవీంద్రునికి కొండలు, నదులు, అడవులు, పచ్చిక బయళ్ళు, మేఘములు చూచిన నెంతయో ఆనందము.

అవి ఆయునలో ఆనందమును, ఉత్సాహమును కల్గించెడివి. అందుచే రవీంద్రుడు చిన్ననాడే కవియై గొప్ప గొప్ప

గ్రంథములు వ్రాసెను. ఆయన అనేక భాషలలో గొప్ప పాండిత్యము కలవాడు.

రవీంద్రుని కవిత్వము క్రమముగా ప్రపంచమును ఆకర్షించెను. అచిరకాలములో రవీంద్రుడు "విశ్వకవి" యని పేరుగాంచెను.

"ప్రపంచమే తన దేశము. మంచి చేయుటే తన మతము. విద్యావిజ్ఞానములవలన ప్రపంచము నందలి మానవులందరు ఏకముకావచ్చును. సర్వసోదర మానవత్వమే సకల విద్యల సారము." ఇదియే రవీంద్రుని తత్వము. తన జీవితమంతయు నీతత్వమును వ్యాపింపజేయుటకై అతడు ధారపోసెను.

"విశ్వభారతి" అనుపేర నొక విద్యాసంఘమును "శాంతినికేతనము" అను నొక విద్యాలయమును ఆయన స్థాపించెను. శాంతినికేతనమునందు సకల భాషలు, సర్వకళలును ప్రబోధింపబడుచుండెను. ఆ సంస్థయే కొంతకాలమునకు "విశ్వభారతి"గ మారెను. పలుదేశములనుండి ఆ విద్యాలయమునకు విద్యార్థులు పండితులు కూడ విద్యకొరకై వచ్చుచుందురు.

రవీంద్రుని మృదువాణికి ప్రతియొకరును మిక్కిలి ఆనందించుచుండిరి. అనేక పర్యాయములు ప్రపంచమువంతయు ఆయన తిరిగి తిరిగి తన ఉపదేశములను వ్రాతలను అందరికి తెలియజేసెను. ఆయన "ప్రపంచ మహాకవి" అని కీర్తిగాంచెను.

# 12. సర్ మహమ్మదు ఇక్బాల్

పూర్వము మన దేశమునందు కాళిదాసు అను "మహా కవి" యుండెను. రవీంద్రుడు "విశ్వకవి" యని పేరుపొందెను. కాళిదాసు, రవీంద్రులవలెనే మహమ్మద్ ఇక్బాల్ కూడ గొప్ప కవి.

మహమ్మద్ ఇక్బాల్ పంజాబునందు జన్మించెను. మన దేశమునందలి మునల్మానులలో ఇంత గొప్పకవి మరియొకరు లేరు.

పసితనమునుండి ఇక్బాల్ మిక్కిలి చురుకుతనమును తెలివిని గలిగియుండెను. ఆయన గురువులు సహితము ఇక్బాల్ మేధాశక్తికి ఆశ్చర్యపడెడివారు.

తన చిన్నతనమున ఒక ముసల్మాన్ గురువువద్ద ఇక్బాల్ అరబ్బీ, పారసీక భాషల నేర్చుకొనెను. అటుపై ఇంగ్లీషువిద్య నేర్చుకొనెను. అంతటితో తృప్తినొందక ఇక్బాల్ ఇంగ్లండు, జర్మనీ దేశములకు వెళ్లెను. ఉన్నతవిద్యల నభ్యసించి మన దేశమునకు తిరిగివచ్చెను.

ఆకాలమునందు విద్వాంసులు ప్రభువులయొద్ద ఉన్నతోద్యోగములను సంపాదించుచుండిరి. అందుచే మహమ్మదు ఇక్బాల్ కూడ పెద్ద యుద్యోగి అగునని అందరు భావించిరి. కాని ఇక్బాల్ స్వాతంత్ర్యప్రియుడు కాన నెట్టి యుద్యోగము కొఱకును ప్రయత్నించలేదు.

ఇక్బాల్ దేశమునకు, ప్రజకు, సేవ చేయ సంకల్పించెను. ఎందరికో ఎన్నియో విధముల సాహాయ్యము చేసెను.

మహమ్మద్ ఇక్బాల్ ఉత్తేజమును కల్గించు గీతములను వ్రాసెను. అనేక గ్రంథముల రచించెను. ఆయన గొప్ప కవి యని కీర్తిగాంచెను.

ఇక్బాల్ మంచి దేశభక్తుడు. దేశమాతపై అనేక గీతములను వ్రాసెను. ఉత్తర దేశమునందు ఈనాడు కూడ ఇక్బాల్ కవిశేఖరుని పాటలను బహు ఉద్రేకముతోడను, ఉత్సాహముతోడను జనులు పాడుకొనుచుందురు.

మహమ్మద్ ఇక్బాల్ గతించెను కాని ఆయన మధుర వాణి యుగయుగములందును జీవించియుండును.

# 13. పండిత మదన మోహన మాలవ్యా

మానవజాతిని బాగుచేయుటకు అప్పుడప్పుడు మహా పురుషులు జన్మింతురు. పుట్టినప్పటినుండి చివరవరకు ప్రజకు మేలుచేయుటే వారిపని. అట్టివారి జన్మ ఎంత గొప్పది ?

మన దేశమునందు అలహాబాదు అను ఒక పుణ్య క్షేత్రము కలదు. దీనిని ప్రయాగ అనికూడ అందురు. ఇచ్చట గంగ, యమున, సరస్వతి నదులు మూడునుకలిసినవి. అందుచే ఆ ప్రదేశమును త్రివేణీసంగమము అని అందురు. ఇట్టి పవిత్ర మగుచోట మాలవ్యా జన్మించెను.

మాలవ్యా తాత చాల కీర్తిగాంచిన పండితుడు. తండ్రి కూడ గొప్ప పండితుడే. ఇట్టి పండితవంశములో పుట్టిన మాలవ్య పండితుడు కాకుండునా ?

మాలవ్యా తల్లిదండ్రులు పేదవారు. చిన్నతనమందు తండ్రియె మాలవ్యాకు చదువుచెప్పెను. సంస్కృతము, హిందీ భాషలు చదివి, పిమ్మట మాలవ్యా ఇంగ్లీషుభాషను నేర్చెను. తాత తండ్రులవలె మాలవ్యాకూడ గొప్ప పండితు డాయెను.

మాలవ్యాకు హిందూమతమునందు గొప్ప అభిమానము. విద్యమూలమున మతమును, మతమువలన సంఘమును సంఘముద్వారా ప్రజాక్షేమమును పెంపుచేయుట మాలవ్యా కోరిక.

మాలవ్యా అలహాబాదునందు ఒకపాఠశాల నేర్పాటు చేసెను. అందు తాను కూడ ఉపాధ్యాయుడుగ చేరి పని చేసెను. అనేక మతసంఘములను నెలకొల్పి వాని ద్వారా విద్యను, మతమును పోషించెను.

కాశీపట్టణమందు పెద్ద విశ్వవిద్యాలయమును ఏర్పాటు చేసెను, ఇందులకు లక్షలాది ధనమును ప్రోగుచేసెను. మన దేశములో ఈ విద్యాలయము మిక్కిలి పెద్దది. ఇందు శాస్త్రములు, భాషలు, కళలు, వృత్తులు నేర్పబడుచున్నవి.

మాలవ్యాపండితుడు అనేక గ్రంథముల వ్రాసెను. ఆయన గొప్ప దాత. తన సర్వము దేశమునకు దానము చేసిన మహాత్యాగి. సకల శాస్త్ర సంపన్నుడు. పూర్వాచార పరాయణుడు.

మాలవ్యా గొప్ప దేశభక్తుడు. ఆయన అనేకవిధముల ప్రజలకు మేలుచేసెను. దేశీయవిద్యలకు, వృత్తులకు ఎక్కువ చేయూతనిచ్చెను. మహాత్మా గాంధీగారితోచేరి మాలవ్యా మనదేశముకొరకు బహువిధముల పాటుపడెను. దేశమునకు సేవజేసి ప్రఖ్యాతిగాంచిన వారిలో మాలవ్యా పండితుడొకడు. గాంధిమహాత్ముడు కూడా మాలవ్యాపండితుని గురువుగా పూజించుచుండెను.

ఆ మహనీయుడు రమారమి యొక సంవత్సరము క్రింద స్వర్గస్థుడాయెను.

# 14. దేశోద్ధారకుడు

కొందరు ధనము వలన గౌరవమును పొందుదురు. కొందరు విద్యవలన కీర్తి గణింతురు. మరికొందరు సుగుణముల వలన ప్రతిష్ఠను పొందుదురు.

గొప్ప కులము, గొప్పధనము, గొప్ప విద్య ఉండుటచే గొప్పవారగుటలో విశేషము లేదు. అది మిక్కిలి సామాన్యము.

దేశోద్ధారక నాగేశ్వరరావు పంతులుగారు మన తెలుగు దేశములో పుట్టిరి. ఆయన తల్లిదండ్రులు మిక్కిలి పేదవారు. తన చిన్ననాడు దరిద్రమువలన పంతులుగారు ఎన్నో కష్టముల ననుభవించిరి. తెలుగు దేశము విడిచి బొంబాయి వెళ్ళిరి. అచ్చట సంపన్నుడగు ఒక వర్తకుని యొద్ద ఉద్యోగిగా ప్రవేశించిరి.

పూవుల సువాసనలను ఎవరాపగలరు ! పేదయుద్యోగి యొక్క మంచిగుణములు యజమానుని మెప్పించినవి. యజమానుడు పంతులుగారిపై చాల దయగలిగి ఉండెను. తరువాత కొద్దికాలమునకే ఆ వర్తకుడు స్వదేశమునకు వెళ్ళుచు, తన వ్యాపారమును పంతులుగారి కిచ్చివేసెను. అందుచే గుణమునకు ధనము తోడాయెను. లక్షలాది ధనరాసులు పంతులుగారి గుణములకు సహాయపడినవి. పంతులుగారు గొప్ప సంపన్నుడాయెను.

పంతులుగారు బొంబాయి వదలి మదరాసు చేరి, తెలుగువారికి అనేకవిధముల తోడ్పడిరి. "ఆంధ్రపత్రిక"ను స్థాపించి ప్రజలకు ప్రపంచవిషయములు బోధించిరి. 'భారతి' అను మాసపత్రికా మూలమున అనేకవిషయములు తెలుగు వారికి నేర్పిరి. బీదల విద్యకొఱకు అంతులేని ధనమును వెద జల్లిరి. బీద విద్యార్థుల కెందరికో అండగా నుండిరి.

పంతులుగారి ధనము ప్రజాసేవకై పలువిధముల విని యోగించబడెను. మన తెలుగు దేశములో ఎందరెందరో కవులు, గాయకులు, పండితులు, కళానిధులు పంతులుగారి ధనసహాయము పొందిరి. పాఠశాలలు, గ్రంథాలయములు మొదలగు సంస్థ లెన్నియో పంతులుగారి ద్రవ్యసాహాయ్య మును పొందినవి.

మన దేశము నందు ఎందరు ధనికులు లేరు ? అంతులేని ఐశ్వర్యముల పెంచుకొనుచు బ్రతికినదినములలో తాము తిని ఇతరులకిచ్చువారు చాలమంది కలరు.

కాని దేశోద్ధారకుడో ! అంతులేని ధనమును సంపా దించెను. అంతులేని దానధర్మములు చేసెను.

ఆయన దానధర్మములలో కర్ణునివంటివాడు. అందుచే మహాత్ముడు పంతులుగారికి "విశ్వదాత" అను బిరుదు నిచ్చెను.

పంతులుగారు గొప్ప పండితుడు. అందుచే ఆయనకు "కళాప్రపూర్ణ" అను బిరుదు వచ్చెను. ఇంతటి మహాను భావుడు కీర్తిశేషుడైనను, బ్రతికియున్నాడనియే చెప్పవచ్చును.

